# ఏల మీరు కామినియా తైలమును మాత్రమే వాడవలెను?

(రిజిష్టరు చేయబడినది)




ఎందుకనగా:

కామినియా తైలము వెంట్రుకలకు చాలలాభకరమైనది.

కామినియా తైలము వెంట్రుకలు ఊడిపోవుటను ఆపును.

కామినియా తైలము వెంట్రుకలు పొడవుగాను, దళముగాను కాంతిగాను పెరుగుటకు తోడ్పడును.

కామినియా తైలము సువాసనతైలము మాత్రమే కాదు. అయితే వెంట్రుకలు పెరుగుటకు కావలసిన ఓషధులు ఇందులో కలవు.

కామినియా తైలము పుర్రెకు చల్లదనమును కలిగించి మెదడుకు విశ్రాంతి నిచ్చును.

చదువుడు, ఆలోచింపుడు, ఆర్డరును పంపుడు.

కలకత్తాలోనున్న ఫార్వర్డుపత్రిక తెలిపినది:—"ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీవారిచే పంపబడిన అత్తరులు, వాసనతైలములు విశ్లేషింపబడి, పరీక్ష చేయబడుటవలన అందులో హానికరమైన వస్తువులు లేవని ఋజువుపరచబడినది. కామినీయా వాసనతైలమునందు మనోహరమైన అత్తరు చేర్చబడినది. మెదడుకు చలువను గలిగించును."

పి. యు. ఆర్. కార్వెల్లో, ఎస్. ఏ. సర్జను, పెరా ద్వీపమునుండి వ్రాసినది:— "కామినియా తైలము మిక్కిలి మంచిదనియు, తృప్తికరమైనదని నిస్సందేహముగా కనుగొంటిని. ప్రత్యేకముగా చుండుకు, పుర్రెకు త్వరలో గుణమును గలిగించును. ప్రస్తుతము వాడుచున్న నా రోగులకందరికిని దీనిని శిఫార్సుచేసితిని."

| | |
|---|---|
| బుడ్డి 1 కి ధర రూ. 1-0-0 | వి. పి. ఖర్చులు రూ. 0-6-0 |
| బుడ్లు 3 కి ధర రూ. 2-10-0 | ,, ,, ,, 0-12-0 |

హెచ్చరిక:—ప్రతిపట్టణమునందును, గ్రామమునందును యున్న సుప్రసిద్ధమైన దుకాణములందు కామినియా తైలము విక్రయించబడుచున్నది. మీరు అడుగునట్టి దుకాణమునందు దొరకనిచో అతని పేరును మాకు తెలుపుము, ఆర్డరును మాకు నేరుగా పంపుము. కొందరు వర్తకులు ఎక్కువలాభమునకై ఆశపడి పేరులేని వర్తకుగుణములు గలవి, తక్కువరకముది "శ్రేష్ఠమైనదని" తెలుపుదురు. గనుక అట్టి తంత్రములను నమ్మి మోసపోకుడు. ఎల్లప్పుడును కామినియా తైలమునే పట్టుపట్టి తెప్పించి వాడుము. ఇతరమైనవాటిని తెప్పించవద్దు.

**ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ,**

285, జుమ్మామసీదు, బొంబాయి.

# మీకు మేలైన సువాసనగల అత్తరులు కావలెనా?

అటులైన అత్తరులకు రాజని పిలువబడు **ఆటో దిల్ బహార్‌ను** వుపయోగించుడు



కొన్ని బిందువులను మీ చేరుమాలుపై చిలికినతోడనే యింపగు, పుష్పసంబంధమగు సువాసన నీ చుట్టుపట్లవ్యాపించును.

ఇంకెటేరమ్యమైన, మనోహరమైన వాసనను నీవు బజారులోకొను యితర అత్తరులలో పొందజాలవు.

'ఆటో దిల్ బహార్' అను పేరును యిపుడే జ్ఞాపకమునకు తెచ్చికొనుడు. దానిని ఒకమారుపయోగించుడు. దాని మనోహరమైన, శాశ్వతమైన సువాసనకు లెన్నడయ్యగును చెందుదువు.

| | | | | |
|---|---|---|---|---|
| ½ ఔన్సు బుడ్డి | వెల | రు. | [illegible]-0-0 |
| ¼ ,, | ,, | ,, | రు. | 1-4-0 |
| 1 డ్రాము ,, | ,, | ,, | రు. | 0-12-0 |
| మాదిరిసీసా | | ,, | రు. | 0-2-0 |
| సువాసనగలకార్డులు | | | రు. | 0-1-0 |

వి. పి. చార్జీలు ప్రత్యేకము.

కొనునపుడు దయచేసి 'ఆటో దిల్ బహార్' అను పేరును జాగ్రత్తగా పరిశీలించి కొనుడు. అన్ని చోట్లను అమ్మబడును.

సోల్ ఏజంట్లు:—

అంగ్లో యిండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెని,
285, జుమ్మామసీదు బజారు, బొంబాయి.

---

# నొప్పులుగాని, తీపులుగాని, ఏవైననుసరియే తొలగింపవచ్చును



మీరు ఏల నొప్పులవలన బాధపడవలెను. ఆ నొప్పులు తలయందైననుసరే, దేహమున యితరచోట్లనైననుసరియే, నడుమునొప్పి, వాతపునొప్పులు, పడిశెము, గొంతురాపిడి, కాళ్లనొప్పులు, కీళ్లనొప్పులు, నాడినొప్పులు, బెణుకునొప్పులు, మొదలగు నొప్పులైనను సరియే, తప్పక త్వరలో

'అడమేన్స్ సైప్రెస్ సాల్వ్'

అనుదానిచే మాన్పవచ్చును. ఇది వుపశాంతికరమగు అంజనము కాదు. ఇది చాలా మేలైన తైలము. ఇది చాలా విలువగల ఓషధులచే తయారుచేయబడినది. దీనిచే నొప్పులు మొదలంటపోయి తత్క్షణమే నిన్ను ఆనొప్పియొక్క బాధనుండి తొలగించును. వేలకువేలు దీనివల్ల లాభపడిరి.

వెల బుడ్డి 1 కి రు. 1-0-0. వి. పి. చార్జీలు ప్రత్యేకము.

ఈ అత్యద్భుతమగు బాధనివారిణి ఫలమును కనుగొనుటకు యీ క్రింద పేర్కొనిన అంగడినుండి 2 అణాలకు శాంపిలుడబ్బి తెప్పించుకొనవచ్చును.

మెస్సర్సు:—ఎ. బి. పారెక్, 259, తైబాబజారు, మద్రాసు.

సోల్ ఏజంట్లు:—అంగ్లో యిండియన్ డ్రగు అండు కెమికల్ కంపెని,
285, జుమ్మామసీదుబజారు, బొంబాయి.

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా."

చనిపోయినతరువాత పుట్టుకపూర్వము మానవుఁడు కాఁడని;

క్షేయం యత్తత్ప్రవక్ష్యామి
యద్జ్ఞాత్వాఽమృతమశ్నుతే
అనాదిమత్పరం బ్రహ్మ
నసత్తన్నాసదుచ్యతే.
—ఈశ్వరుఁడు లేఁడని;

శ్రుతి. అసదేవేదంపురాసీత్

అనియును;

"లాయిలాహ ఇల్లల్లా.
—అని ఖురానులోను, ఇట్లే మఱికొన్నియు గలవు.

"నమాంసభక్షణే దోషో నమద్యే నచమైథునే
ప్రవృత్తి రేషా భూతానాం నివృత్తి స్తు మహాఫలః."
"శ్రోత్రామణ్యాం సురాం పిబేత్ ప్రోక్షితం
భక్షయే న్మాంసం వైదికీ హింసాహింసా నభవతి."
—అని మనువును,

"ఉష్ణా మధ్యాసవం పీత్వా ఉష్ణా దంపనబర్జితా,
ఏకపర్యంకశయితౌ దృష్ట్వా మే కేశవార్జునౌ.
—అనిపరాశరుఁడును.

* మద్యసేవన మాంసభక్షణాదిదోషములవలన పాపము రానేరదని వ్రాయుచున్నారు.

ఈ ఉమరుఖయాముడు, చార్వాకులును పాపపుణ్యములను వని లేవనియు

తే.గీ. ఎంతకాలంబు నదిలోన నీవిధాన
రాళ్లు విసురుదు రాళ్లను గుళ్లయందు
పూజచేసి హితాకునీఁ బోలెఁ బోదు
తెమ్ము మద్యమ్ము చెలువ, ముద్దిమ్ము రమ్ము
నరకమేమిటి స్వర్గంబు నాఁగనేమి.
ఉసురునిడిచి యాలోకమున్ మునుఁగునందు
మాయమై పోయెదవుగాన మధువు త్రావి
కలదినంబు లానందాన గడుపుమెచట
కేఁగెదో వచ్చితెటనుండి యెఱుఁగ వీవు.

వ. శతధినిఁబోలువిద్యయును
జ్వాలనుబోలినజ్ఞానదీప్తియున్
బరఁగినవారు లీరితర
భాసురగాఢమహాంధకారబం
ధురతరమార్గముఁ గడచు
త్రోవ తెలుంగక కల్పనాకథా
భరితవిచిత్రవాక్యములఁ
బల్కుచుఁ నిద్దురఁబోయి రెంతయున్.

ఇట్లే ధర్మాధర్మములు, పూర్వాపరములు, స్వర్గనరకములు లేవు. ఇసుకనుండి తీసినబంగారమునకు దగ్ధకాష్ఠన్యాయమునుబట్టించి చూచినలయును. మానవులు తృణయవవ్రీహ్యాదులనుండి రేతోరూపమున మాతృగర్భమునఁ బ్రవేశించి వెలువడుచున్నారు. నిన్న నాకులతోపచ్చగనున్న బంతిమొక్క నేఁడెఱ్ఱని పువ్వుచే నొప్పుచున్నది. అట్లే పరిణామమే మూలకారణము. అవాఙ్మనసములగు పదార్థములపై నమ్మకముంచి భూతికి, సౌఖ్యమునకు భంగముగలిగించుకొనరాదు. చిన్నచిన్న గుంటలలోనినీళ్లు కప్పలేదప్పుచున్నను పశువులు త్రాగిపోవును. అట్లే తనసుఖమేకాని యెదుటివారియిబ్బందికై విచారింపనక్కఱలేదు. ఎల్లవారు స్వార్థపరులైనను పైకి పరోపకారులవలె దోచుచుందురు. అదిమోహము. దానముకూడ స్వార్థమే. గడ్డిమై కొఱుకబతుకంటె పస్తైకొనుట మంచిది. ఒకరు నిన్నువలచితే నీవు వారిని వలచుచున్నావు. ఆనందమేకాని దుఃఖమనేది లేదు. దుఃఖము నీవు కొనితెచ్చుకొనుచున్నావు. రాగమేకాని రోగము లేదు. వేడుకయేకాని వేడికోలులేదు. నిన్నటికి నేఁడొకదినము ముదిమిఆవహించినది. ముదిమి మేనిపై ముసుగువలె మూయకముందే యిష్టోపభోగముల నందుము. నీవు కన్నులు మూయగనే నీసమాధిత్రవ్వవచ్చువాఁడే, గడ్డపార చేతధరించి నిలిచినవాఁడే దండధరుఁడగు యముఁడు. వానిపారయే పాపపుణ్యములను తూఁచుత్రాసు. ఆబలిపీఠమే అన్నిటికి స్వస్తిచెప్పుమంత్రపేటిక ఏసును బలియిచ్చినారు. ఆరుధిరావలిప్తమైన బలివేదికయే యమధర్మరాజు సింహాసనము. అందు బలియయ్యె

* ఖురాను మిక్కిలిదోషమని చెప్పుచున్నది.

బడినవాడు వృత్తికారేణుసముదాయముచే పరిణమిం
చిన ఎముకలు రక్తమిశ్రితమైన మాంసవసాస్వరూపమగు
వ్యక్తి. అది శరీరమును వదలి ఒకగంతువేసి వాయువులో
గలిసిపోవును. దాని నెవరు పట్టుకొనగలరు? ఎవరికి కావ
లెను? అంతామిథ్య. ఈశ్వరభక్తిని గూర్చి చెప్పినవన్ని
యు ముసలమ్మకథలు. అవి నిర్వ్యాపారముగ గూర్చుం
డుపోమరులచే కల్పింపబడినవే. వేదాంతములు (మారి
ఫత్), సూఫీలు (బ్రహ్మసూత్రములు), తసవ్వుఫు వ్రాసి
నారేకాని ఆత్మస్వరూప మిదమిత్థమని నిర్ణయింపలేక
సర్వాంతర్యామియని యథోచిత నాస్తికవాదములోనికి
లాగి మఱింత యంధకారములోనికి దింపివిడిచినారు.
ఇవియేమియు యథార్థములు గావు. జీవించినన్నాళ్లు
భోగించుటయే దారి. అదే జీవపరమావధి. అని పెక్కు
విషయములచే సమగ్రమైన నాస్తికవాదము నిందుపూర్వ
పక్ష సిద్ధాంతములచే వ్రాసి అందందు శృంగారరసస్వరూ
పములను భావములచే పాఠకులహృదయములను మిక్కిలి
ఆకర్షించినాడు.

ఉ. ఆరమణీమనోహరము
ఖాబ్జము ముంగురు లుంగరాలసిం
గారము పెట్టి దిద్దితి వి
కాసముగుల్కెడు ముద్దరాల, సొం
పారఁగఁ బొందరా దనెద
వక్కట, నిండినాఁటి పాత్రముఁ
బోరలవేసి నేలపడఁ
బోలదు నీరునునట్టులుండదే!

ఇట్టివే పెక్కులు గలవు. గ్రంథవిస్తరమని వ్రా
యలేదు. ప్రతిపద్యమును భావపూరితమైన ప్రస్తావన
మున కనుకూలించునట్లుండును. ఇట్లే రాజులను గూడ
నిందించినాఁడు.

ఉ. గాడిదవంటి యీనృపుల
కైవస మేమిఫలంబుగూర్చు నీ
తోడను నేలపాండితినిఁ
దోడ్కొనిపోయెదు నీరు విద్యకుఁ
బోడిమికిఁ జెలఁ బసఁగఁ
బోనరు వత్సరమేడిపించి యే
నాఁడును చేరఁడంబువుల
వర్తిలిఁ బోయరు దాహ మారఁగన్.

అన లీతఁడు విషయాసక్తుఁడే కాఁడని, ఈతని వేదాంతము
లోని మధువు ధ్యానామృతమని, కాంత ముక్తికాంత
యని, విషయోపభోగములు సమాధినిష్ఠావిధానము లని
తాబలు పొల్లు పోకుండ అర్థములు చెప్పువారునుకలరు.
వారీతని గ్రంథమునందిరో అనేకోదాహరణములు చూ
పించెదరు. అవి:

శా. రాగద్వేషము లాశ్రయించి విషయ
భ్రాంతిఁ బ్రవర్తింప మ
ద్యోగింపఁ దగునా జగాన విధిసం
యోగంబుచే నింపితో
భోగాపేక్షను వచ్చిపోయి రిటులే
ముందింక రానున్న వా
రేగఁ జూతురొ కాని యొక్కఁ డిలపై
యిష్టార్థముల్ పొందఁడే.

ఉ. నీవు ధరిత్రి కామవిష
యేచ్ఛలకై జనియించితందు నీ
భావమునన్ దలంపకుము
వ్యర్థుఁడవై నశియించిపోదు వే
తావునుండి వచ్చితివొ
తథ్యము నీవన నేమివస్తువో
నీవిపు డేమొనర్పుటకు
నెంచితివో పరికింపు మింతయున్.

మ. విషయాసక్తికి లొంగిపోవక మహా
వేగంబుతోఁ బోవు నా
విషరాశింబలె తీవ్రవహ్నివిలసత్
విస్ఫూర్తిపై దాఁచి పౌ
రుషలీలన్ మనఁజెల్లుఁ గాని రజమై
శోకాంతరాళంబునన్
దృష్ణాతాపాహతిఁ బోవునట్టి బ్రతుకిం
కేలా విచారింపఁగన్.

అని యిన్నియో జితేంద్రియత్వమును గూర్చిన మహా
విజ్ఞానవిషయములను గూడ వ్రాసినాడు. ఈతఁడెప్పు
డును ఆసవపానాది దుర్విషయములుగాని కామినీప్రక్కం

షనాది విషయలంపటులకుగాని కాదని చరిత్రజ్ఞులు వ్రాయుచున్నారు. ఔరంగజేబు నీతిని గ్రంథమును, హాఫీజు (షీరాజు దేశ సుప్రసిద్ధుడైన పారసీకవి.) ప్రబంధమును దేశస్థు లెవరును చదువరాదని నిషేధించినాడు. జేబున్నిసా (ఔరంగజేబుకుమార్తె) ఈగ్రంథముల నిరంతరము పారాయణము సేయుచుండెడిది. ఈవిషయమునుగూర్చి ప్రజ లౌరంగజేబునకుఁ దెలుపఁగ వీనిని యర్థముచేసికొనఁ గలిగితేని చదువవచ్చునని చెప్పిపంపినాడు. దీనినిగూర్చి అగ్బరు నిక్రమత్తితనఅయినఅగ్బరు అనుగ్రంథములో మిగుల ప్రశంసించి యీ మహాగ్రంథములోని యుద్దేశములు లనన్యసామాన్యములు; ఎల్లవారు గ్రహించుటకు సాధ్యముగావు; వ్రాసినాడు. మొత్తముపై నీ స్తోత్రము చదువుచున్నంతసేపు మనస్సును చాల ఆకర్షించుచుండును. రహస్యరూపమెరుగు శాంతమగుచున్నదాయని తోచకపోవదు. ఇట్టిపరివర్తన మింకొకగ్రంథమువలన రానేరదు.

---

# కీరమా!

నాళము కృష్ణారావుగారు

"ఎచటి కేగెదు? కీరమా! యిందు రమ్ము
ఏటి కాయాసపడెదవు ఎగిరి యెగిరి?
పసిడితీఁగలఁ గూర్చిన పంజరంబు
వ్రేలఁగట్టితి, నల్లదే! వ్రాలు మందు.

దోరపండిన నునుపారుదొండపండ్లు
పరువమొందిన తీయని పనసతొనలు
కుడువఁబెట్టెద నిచ్చలు కడుపునిండ
ఆరగింపుము కీరమా! హాయి మీఱ"

"మోదమందితి బాలరో నీదుదయకు
డంబు మీఱిన నీపంజరంబుకంటె
మఱ్ఱిమ్రాకున పలుబారు తొఱ్ఱలోని
నాదువెచ్చనిబిగిగూడె నాకు హితము

తళుకువెన్నెలలందలి తళతళలును
మించునునుమంచుబిందుల మిలమిలలును,
కమ్మతెమ్మెరలందలి గమగమలును
విడిచి, నీయింట కడగండ్లు బడఁగ నేల?"

"మంచుకొండల మూలమూల మాఁడిమాఁడి,
వానసోనలఁ బలుమాఱు నాని నాని,
మంచుబిందుల మాటికి మాఁగి మాఁగి
కఠినశీతమున వడవడ వడఁకి వడఁకి

గాసి నొందఁగ నేటికే గండుచిలుక?
మంజులంబగు నాపైఁడిపంజరమున
కొంతకాలము తల దాచికొనఁగ రాదె?
ఇచ్చగలదేని పిదప పోయెదవు కాని."

"మంచుకొండలు వానయు మంచు నీతు
మీకు మనుజులకే కాని మాకుఁ గలవె"
స్వేచ్ఛతర మగు నిర్మలవాయువులను
స్వేచ్ఛమీఱ విహారంబు సేయుచుందు.

మంచుమలలందు నొకసారి మలయుచుందు
జలదపంక్తుల నొకమాఱు చొక్కళింతు
సాగరముమీఁద నొకపరి సంచరింతు;
పులుఁగులగుమాకుఁబుతుభేదములును గలవె"

"గిరుల, మబ్బుల, నంబుధిఁ దిరుగునపుడు
త్రోవ తప్పి భ్రమింపవే తోడు లేక?
చిన్నచిలుకరో! నీకిట్టి సలుగు లేల?
చెలఁగి నాయుండ నెపుడు వసింపరావె?"

నోరు లేనిట్టి పసులకే వారముకుఁ
దోడుపడు నెవ్వఁ డాతండె త్రోవ సూపు;
కిరణములఁ జిమ్మ, జిగిమబ్బుపొరలఁ జించి
లీల విహరింతు నిచ్చమై గాలి వోలె.




కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు

(వెనుకటి సంచిక తరువాయి)

వీరభద్రారెడ్డి

ఇదిగో నిటఁ దమలపాకు లమ్ముచున్నది; దీనిం జూచి తమలపాకులు బేర మాడి రమ్ము.

(శ్రీనాథుఁడు పోయి వచ్చును.)

వీరభద్రారెడ్డి

రసికాగ్రగణ్యా! తమలపాకులదానిం జూచి వలచితివా యేమి? పెక్కుమాటలు సాగించితివి.

శ్రీనాథుఁడు

(నవ్వుచు)

"చ. తొలకరిమించుఁదీవ గతి
 దోఁప దుకాణముమీఁద నున్న యి
య్యలికులవేణితోఁ దమల
 పాకుల బేరము లాడఁ బోయి నే
వలచుట కేమి శంకరుని
 వంటిమహాత్ముఁడు లింగరూపియై
కులుకుమిటారిబొమ్మపయిఁ
 గోరిక లీరిక లెత్త నాడఁగన్."

వీరభద్రారెడ్డి

శ్రీనాథా! నీకెంతసాహసమున్నదో చూచితిము! చెంగావిచీర గట్టుకొని పోవునీప్రావుఁబోడిం నిలిచి మాటాడుము.

శ్రీనాథుఁడు

"సీ. సొగసు కీల్జడదాన! సోగకన్నుల దాన
 వజ్రాలవంటి పల్వరుసదాన!
బంగారు జిగిదాన! బటువుబొమ్మలదాన!
 నయమైన యొయ్యారి నడలదాన!
తోరంపుఁగటిదాన! తొడల నిగ్గులదాన!
 పిడికిట నడఁగు నెన్నడుము దాన!
తళుకుఁజెక్కులదాన! బెళుకుముక్కరదాన!
 సింగారి కనుబొమ చెలువు దాన!
మేలిమి పసిండి రవకడియాలదాన!
మించి పోనేల రత్నాల మించుదాన!
తిరిగి చూడవె ముత్యాల సరులదాన!
చేరి మాటాడు చెంగావి చీరదాన!"

వీరభద్రారెడ్డి

కవిరాజా! కవులు తమ స్వభావమెట్టిదయ్యును సమయానుకూలముగఁ బ్రవర్తింపనేర్తు రనుటకు నీయిప్పటి శృంగారవర్ణనమే సాక్ష్యమిచ్చుచున్నది. నీవు మహానుభావుఁడవు, సకలవిద్యాపారంగతుఁడవు. బ్రహ్మజ్ఞాననిష్ఠాగరిష్ఠుఁడవు. నిన్నవశేవిధంబునఁ దలంచిన నేమిలోపము! మహాకవీ! మన మింట వచ్చి చాలకాల మయినది. గంగాదర్శనము చేసి

మార్కండేయేశ్వరు నారాధించి నగరునకుం బోవుదము రమ్ము.

శ్రీనాథుడు

దేవరవారియాజ్ఞ.

(ఇద్దఱు నడచుచున్నారు.)

(అటవీక్షేపంబునఁ బుష్పగిరిక్షేత్రంబును, గౌతమీనదియు, మార్కండేయేశ్వరాలయంబును గానిపించును).

శ్రీనాథుడు

(గంగదిక్కు మొగంబై చేతులు జోడించి)

శా. శైవాగ్రీయజటానవస్కరమహా
స్థానంబునం బొల్చి వే
ధోవిద్ధోరుకమండలూదరమునం
దు న్నిల్చి విష్ణ్వంఘ్రిరా
జీవంబందుఁ దలిర్చి భూమిగతవై
చెన్నారు నో గౌతమీ
దేవీ! సేవ యొనర్తు దీనుని ననుం
దీపింపఁగాఁ జేయవే.

(రాజదిక్కు మొగంబై) రాజా! యిప్పద్మాద్రిం దిలకింపుము.

మ. కల దిచ్చోటఁ గృతాదికాలమున లో
కప్రస్తుతంబై మునీ
ట్కాలితంబై యమృతంపుఁగుండము మహా
కల్పంబునం దైనఁ ద
జ్జల మానన్ మృతి లేక జంతుతతి హె
చ్చన్ దానిపైఁ దమ్మిపూ
పొలుపుం గాంచినకొండఁ బెట్టి రమరుల్
ప్రోలింతె భూపాలకా!

ఈ పుష్పగిరి వరంబు—

మ. అవలన్ నాశికనుండి సాగరమునం
దాంతర్గతం బొందుదా
కివలన్ వ్రేలుచు భూపురంధ్రిగళమం
దింపారుముత్యాలపే
రవు నా గౌతమి వొల్చుదాని తరళం
బై పద్మభూభృద్వరం
బవిత్రబ్రాహ్మణలోకమై వెలయు లో
కాధీశునాస్థానమై.

(రాజుతో నించుక నడిచి మార్కండేయేశ్వరుం దర్శించి చేతులు జోడించుకొని)

మ. ఉదితక్రోధముతోడఁ బ్రాణహననం
బుఱ్ఱాఁతలూఁగింప ను
న్మదుఁడై వచ్చినదండపాణి నెదురన్
దర్శించి దైన్యంబునన్
బదియాఱేఁడులబాలుఁ డయ్యొ నెడఁదం
బ్రార్థింపఁ దజ్జీవన
ప్రదుఁడై పొల్చినశర్వునిం గొలుతు మా
ర్కండేయనామేశ్వరున్.

వీరభద్రారెడ్డి

(స్వామికి నమస్కరించి కవిరాజుం గాంచి) కవీంద్రచంద్రమా! నేఁడు మన రాజమహేంద్రపట్టణము చుట్టి చూచితిమి గదా! ఇది నీకెట్టిమనోరథంబు పుట్టించినది? ఇదియెట్టి ప్రభావము గల దని తోఁచినది? చెప్పుము.

శ్రీనాథుడు

రాజేంద్రా! చెప్పెద నవధరింపుము.

ఉ. రాజమహేంద్రుకాలమున
వ్రాసెను నన్నయభట్టు భారతం

భోజమెయిం దదాదిగ
మహోన్నతిఁ దెల్గది జన్మభూమికా
రాజిలు నిష్పదుల్ సుకవి
రాజసమంచితమై తలిర్చుటల్
రాజమహేంద్ర మొప్పెసఁగు
నాఁటికి నేఁటికి సాటి లేనిదై.

వీరభద్రారెడ్డి

నీ కానందసంధాయక మగుటయే మా కానందము కవీంద్రా! మన మింక నగరునకుం బోవుదము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు. తెరపడును).

అంకాంతము

---

స్థలము—ఆస్థానము

[వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, అన్నామాత్యుఁడు, శ్రీనాథుఁడు, పురోహితుఁడు, ప్రవేశము.]

వేమభూపాలుఁడు

కవిరాజా! కృతిగ్రహణంబునకు ఋషిప్రోక్త కల్పంబు గలదా? తద్విధాన మెట్లు?

శ్రీనాథుఁడు

కృతిగ్రహణంబునకు ఋషిప్రోక్తకల్పంబుగలదు. "ఆదౌ పూజ్యో గణాధిపః" అనుటం జేసి గణపతిపూజం గావించి, పిదప నవగ్రహారాధనంబును, అష్టదిక్పాలకపూజయుం గావించి, యనంతరంబ కలశస్థాపనంబుచేసి, యందు గ్రంథముం బ్రతిష్ఠించి, సరస్వతింబూజించి, మంగళతూర్యంబులు మొఱయుచుండ నా గ్రంథము కృతికర్త కృతిభర్త హస్తయుగంబునం బెట్టుటయు నందలి కృతిపద్యము లొండు రెండు చదువుటయు దానివిధానము.

పురోహితుఁడు

ప్రభువర్యులారా! సుముహూర్తము సమీపించినది. ఆజ్ఞకుఁ బ్రతీక్షించుచున్నవాఁడ.

(వేమభూపాలుఁడు అన్నామాత్యునిం దిలకించును).

అన్నామాత్యుఁడు

బ్రాహ్మణోత్తమా! కల్పోక్తక్రమంబునఁ బూజం గావింపుము.

(పురోహితుఁడు శ్రీనాథునిచేతినుండి పుస్తకముం బుచ్చుకొని మంటపముపైఁ బెట్టి పూజించును).

(శ్రీనాథుఁడు కాశీఖండమును బూజాస్థానముఁ నుండి పుచ్చుకొని వేమారెడ్డిదిక్కు మొగంబగును).

వేమభూపాలుఁడు

సార్వభౌమా! ఆంధ్రమహీమండలాఖండలుండైన వీరభద్రభూపాలునకుఁ గృతి సమర్పించి కృతార్థుండ వగుము.

(శ్రీనాథుఁడు వీరభద్రారెడ్డి సమ్ముఖమ్మునకుం జని వాని హస్తయుగంబున గ్రంథముం బెట్టును. కరతాళధ్వనులు మంగళతూర్యములు మొఱయును).

అన్నామాత్యుఁడు

కమలనాథపౌత్రా! నీవు ధన్యుఁడవు. శ్రీమహావిష్ణుతుల్యుం డయిన మా రాజేంద్రునకుఁ గృతి సమర్పింపఁ గలిగితివి.

వేమభూపాలుఁడు (శ్రీనాథునకు రత్నాంబరంబు లర్పించును).

అన్నామాత్యుఁడు

కవీంద్రా! కృతిసమర్పణ పద్యములు చదువు దువా?

శ్రీనాథుఁడు

చిత్తము. మహామాత్యుల యాజ్ఞ!
(రాజుచేతిలోని పుస్తకమును బుచ్చుకొని వాగ్దేవిం బ్రార్థించి)

"శా. శ్రీకాశీనగరాధిరాజ్యపదవీ
సింహాసనాధ్యాసి లో
కైకగ్రామణి విశ్వనాథుఁడు విశా
లాక్షీ మనోభర్త సు
శ్లోకుం దొడ్డయయల్లభూవరు తనూ
జున్ వీరభద్రేశ్వర
క్ష్మాకాంతుం జగనొబ్బగండని మహైశ్వ
ర్యాన్వితుం జేయుతన్."

"క. గజదళ విభాళబిరుదున
కజగవధరభక్తి భావితాత్మునకు సభా
ద్విజయునకు రాయవేశ్యా
భుజగునకును వీరభద్ర భూపాలునకున్."

"వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొన
ర్పం బూనిన కాశీఖండంబు."

"మాలిని. వికచకమలనేత్రా! వేమమాంబాసు
పుత్రా!
సకలనృపశరణ్యా! సంశ్రితాశేషపుణ్యా!
మకరనిధిగభీరా! మానినీచిత్తచోరా!
ప్రకటగుణతరంగా! రాయవేశ్యాభుజంగా!"

"స్వస్తి"

(చదివి మరల పుస్తకము రాజు హస్తములం దుంచును).

వీరభద్రారెడ్డి

(పుస్తకము మరల శ్రీనాథున కిచ్చి) అగస్త్యులు కాశిం బెడఁబాయునట్లు రెండు పద్యములు చదువుము.

శ్రీనాథుఁడు

"సీ. పరమకళ్యాణి! యోభాగీరథీ! గంగ!
వార్ధిభామిని; పోయివత్తు నమ్మ!
యమరేంద్రులార! లోలార్క-కేశవులార!
వనజసంభవ! పోయివత్తు నయ్య!
శ్రీవిశాలాక్షి! దాక్షిణ్య పుణ్యకటాక్ష!
వాసవార్చిత! పోయివత్తు నమ్మ!
శ్రీపూర్ణభద్ర పారిషదనాయకులార!
వటుకభైరవ! పోయివత్తు నయ్య!
తీర్థసంవాసులార! కృతార్థులార!
పాశుపతులార! భాగ్యసంపన్నులార!
మందిరోద్యానవాటికామఠములార!
పోయివత్తును మీ కాశిపురము విడిచి"

"సీ.కలహంసి రారాదె కదలి నాతోఁ గూడి
నీ వేల వత్తమ్మ నెమ్మి నుండి
కదలీకాకాంతార! కదలి రా నమఁ గూడి,
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
శ్రీవిశాలాక్షి! విచ్చేయు నాతోఁ గూడి
నీ వేల వత్తమ్మ నెమ్మి నుండి
నాతోడఁ గూడి యంత స్నేహ! నేఁ బెమ్మ
నీ వేల వత్తమ్మ నెయ్య నుండి
రండు నన్నఁ గూడి యోహరిన్మాట్టులార!
వత్సలత గల్గి మీ రేల వత్తు రయ్య!
పరమనిర్భాగ్యుఁ డైననాప్రజ్ఞ పట్టి
కటకటా! సౌఖ్యజలరాశిఁ గాశిఁ బాసి."

ప్రాచీనమహారాజుల చిత్రములు



చిత్రము ౧

'నెఫర్ టిటి' రాణి

వీరభద్రారెడ్డి

ఆహా! నీకవిత్వ మనన్యసులభ మమృతప్రవాహము. నన్నయతిక్కనాదులును నీకుఁ దక్కువ యనియే నాయభిప్రాయము.

అన్నామాత్యుఁడు

మేలు మేలు. మహారాజా! మేలు మేలు. మనుబోంట్లమాట మాట కాదు. విద్వత్ప్రభువులమాట మాట. మీరు మెచ్చుట లోకత్రయంబు మెచ్చుట యని నాసిద్ధాంతము.

వేమభూపాలుఁడు

గౌడడిండిమభట్టు నోడించిన వీనిపాండిత్యమును, నైషధకాశీఖండంబులం దెలిఁగించిన వీని కవిత్వమును మెచ్చుకొననివాఁ డెచ్చట నైన నుండునా?

శ్రీనాథుఁడు

ప్రభువర్యులయనుగ్రహము కాని నేను సామాన్యుఁడను.

వేమభూపాలుఁడు

శ్రీనాథా! గాంధర్వకవిత్వములు పుట్టుకతోడం బుట్టునవి యందురు. చదువుకొనినఁ గవిత్వము చెప్ప లేనివాఁ డుండునా? పాడ లేనివాఁ డుండునా?

శ్రీనాథుఁడు

దాని కర్థ మిట్లు కాదు. రెండు కూనిరాగములు తీయుట సంగీత మనియు, గురులఘుజ్ఞానము గలిగి రెండు గీతలు గీయుట కవిత్వ మనియుఁ దలంపరాదు. ఆపాతమధురమైన సంగీతమును, ఆలోచనామృతమైన కవిత్వమును బహుప్రాక్కృత కర్మపరిపాకంబునం గలుగునవి కాని సామాన్యములు కావు.

వేమభూపాలుఁడు

చతుర్విధాంధ్రమున గ్రామ్య ముపయోగించుకొన నొప్పదా? అది వ్యవహారబద్ధము కాదా?

శ్రీనాథుఁడు

వ్యవహారము దేశమునకు గ్రామమున కొక విధము. శాసనము లేనిభాష సర్వజనైకవేద్యము కాదు. కావున గ్రామ్యము నింద్య మనియే మహాకవులసిద్ధాంతము.

వేమభూపాలుఁడు

గ్రామ్యకవిత్వ మెట్టిదనో విన నభిలషించుచున్నవాఁడ.

వీరభద్రారెడ్డి

(శ్రీనాథుం జూచి) నిన్న మనము వీథినాటకమునఁ జూచియున్నకవులం బిలువ నంపి తెప్పించినవా రీమహారాజునభిలాషం దీర్పఁ గల రని తలంచెదను, (అన్నామాత్యునిం జూచును).

అన్నామాత్యుఁడు

ఎవ రక్కడ?

భటుఁడు

(ప్రవేశించి) అమాత్యశిఖామణీ! ముదల యేమి?

అన్నామాత్యుఁడు

నీవు పోయి ధర్మశాలలో నున్నవైదేశికులం దీసికొని రమ్ము. పొమ్ము.

భటుఁడు

చిత్తము.

(నిష్క్రమించును)

శ్రీనాథుఁడు

వేమభూమీశ్వరా! గ్రామ్యకవులు మూఁడు తెఱంగులై యున్నవారు. లోకములో జనులు

వ్యవహరించునట్లు గద్యపద్యము లల్లువారు. భావకవిత్వము లని కొంతవ్యావహారికభాషం జేర్చి కవిత్వము చెప్పెదు మనువారు. నీచాతి నీచభాషతోఁ బాటలు పదములు నల్లువారును.

వేమభూపాలుఁడు

ఇందు భావకవిత్వ మను నర్థ మేమో నాకుఁ దెలిసినది కాదు. భావము లేనికవిత్వ ముండు నా? ఉన్న నది కవిత్వమా? భావకవిత్వ మని యొకతెగకుం బేరు పెట్టుట యేమి?

శ్రీనాథుఁడు

ఈభావము దేవర యూహించెడుభావము కాదు. ఈభాష మెట్టిదో యిప్పుడే విందురు గాక.

(అంత బైఁ జెప్పినముగ్గురు కవులును బ్రవేశ పెట్టఁబడుదురు).

(అన్నామాత్యుఁడు వారిని విశ్రమింప నియోగించును).

గ్రామ్యకవి

దేశభాషల్లో కవిత్వం చెబితే దేశీయులకి తెలుస్తుం దని చెప్పి అట్లు వ్యావహారికభాషలో గ్రంథా లుంటే సర్వజనులకీ సుబోధకంగా వుంటుం దనిన్నీ చచ్చి కుళ్లినడొక్కల్లా గున్న మృతభాష పనికి రాదనిన్నీ, దాంతో గ్రంథాలు చెయ్యడం పాప మనిన్నీ, ఆపాత్తెనుగుతో గ్రంథాలు రాస్తే పిల్లాళ్లుఅర్థం చేసుకో లేక నానాచిక్కులూ పడి వ్యర్థులై పోతా రని, అల్లా శాసనాలు పుట్టా లని నేను పదిపదిహేను సంవత్సరాలనుంచి భగీరథప్రయత్నం చేస్తూ వున్నాను. నామానప్రాణధనాలు దీనికే విని యోగిస్తున్నాను. ఏలినవా రనుగ్రహానికి ప్రతీక్షిస్తున్నాను. నేను కోరేది శాసనాల్లో వుండే మాటలు పాత్తాటాకుపుస్తకాల్లో వుండేమాటలే కాని మరోటి కావు. ఇంతే నావిన్నపం.

వేమభూపాలుఁడు

గ్రామ్యవాదీ! పద్యము కూడ గ్రామ్యములో నుండవలయు నందువా? వచనములో మాత్రమా?

గ్రామ్యకవి

రెంటియందున్నూ.

వేమభూపాలుఁడు

ఏదీ చూతము. గ్రామ్యముతో నొక్కపద్యము చెప్పుము.

గ్రామ్యకవి

క. చెబితే గ్రామ్యకవిత్వం
పెబు లందరు మెచ్చఁ జెప్ప వాలది కాదా
ఊబు సెందుకు పూరోక్క వలె
సబలోపల మెచ్చు మెంచు సత్కవివైతే.

అందఱు

(నవ్వుచుఁ గరతాళధ్వనులు చేయుదురు).

వేమభూపాలుఁడు

మేలు మేలు గ్రామ్యవాదీ! మాపండితు లందఱు నిన్నుఁ జూచి కవిత్వము నేర్చుకోవలసిన వా రగుచున్నారు.

అన్నామాత్యుఁడు

నీగ్రామ్యకవిత్వలక్షణము తెలిసినది. నీవు విశ్రమింపుము. (భావకవిదిక్కు మొగంబై) ఓయీ నీభావకవిత్వప్రభావ మొక్కసారి వినిపింపుము.

భావకవి

భావకవిత్వ మన్న సామాన్యము కాదు. సామాన్యులకు మాకవిత్వములోని భావము తెలియుట దుర్లభం. అది యిప్పటివారికి తెలియక పోయినా ముందువచ్చేవారికి తెలియక పోదు. ఆఫల మపేక్షించే మే మిట్లుద్యమించినాము.

వీరభద్రారెడ్డి

ఒక్కపద్యము చెప్పుము. విని యానందించెదము. దానిభావము మాకుఁ దెలియకున్న మాపండితులకైనం దెలియకుండునా? అట్లు తెలియకున్న నీవే చెప్పి నీభావము వెల్లడింతువు గాక.

భావకవి

చిత్తము, చిత్తము, చిత్తగింపుఁడు.

చ. చిలుకలు చెట్లకొమ్మలన
    సించి కుహూ యని యాటలాడు కో
కిలములు కావు కావు మని
    కేకలు వైచెడు కొండ లెక్క కో
తులు కయిసేసి సింగములతో
    సరసంబులు సంతరించు ని
క్కలియుగరాజుకుణ్ సకల
    కాలము జాలిని గోరి దీర్ఘతణ్.

వేమభూపాలుఁడు

భేషు! భేషు! భావకవీ! భేషు! భేషు! నీవు చెప్పినట్లే నీభావము మాకు స్ఫురించినది కాదు. నీవే చెప్పి మమ్మానందింపఁ జేయుము.

భావకవి

తనకవిత్వమునకు తానే వ్యాఖ్యానముచేయుట తప్పని చెప్పుదురు. అట్లే నాకవిత్వమునకు నేనే భావము చెప్పుట తప్పే యగును. కావున నేఁ జెప్ప రాదు.

వేమభూపాలుఁడు

కవిసార్వభౌమా! దీనిభావము నీవుచెప్పగలవా? ఇందు భావమున కభావమే యని నాభావము

శ్రీనాథుఁడు

అట్లనుట న్యాయ్యము కాదు. ఇట్టి భావార్థంబులు తొల్లియుం గలవు. ధారా నగరాధీశ్వరుం డగు భోజరాజు రాజ్యము సేయుకాలమున నొక్కనాఁ డొక్క తిలఘాతుకు నలంకరించి కాళిదాసుఁడు రాజదర్శనంబు సేయించె. రాజు నమస్కరింపఁగా వాఁడు అశ్వనీ, పునర్వసూ, కృత్తికా, రేవతీ, యని యాశీర్వదించినాఁడు. రాజు వాఁడు మూర్ఖుఁ డని గర్హించుచుండఁగాఁ గాళిదాసుఁడు రాజా! దీనిభావ మతిగంభీరము. ఆలకింపుము. "శ్లో. అశ్వనీ భవతు భూప మందురా, మందిరే భవతు తే పునర్వసూ; కృత్తికాతనయవిక్రమోస్తు తే, రేవతీపతికనిష్ఠ సేవయా" అని వీని యభిప్రాయము. అని చెప్పినాఁడఁట! అట్లే యీ భావకవియును. దీనిభావం బాలకింపుఁడు.

కలియుగరాజుకుణ్ =కలియుగములో రాజైన వీరభద్రరాజునకు, సకలకాలము=ఎల్లకాలము జాలినిగోరి = కరుణతోఁ డనని యర్థము ధ్వని; దీర్ఘతణ్=దీర్ఘత్వముగా; అనఁగా దీర్ఘాయుర్దాయమును జెప్పకో వలయును; మఱియు నిందు కలి; యుగ, రాజ, కల, కాల, జాలి, గోరి, వీనికి నానార్థములు కలవు. ఏయర్థము కావలయు నన్న నా యర్థము చెప్పుకొన వచ్చును.

చిలుకలు=చిలుకలవంటి స్త్రీలు, చెట్ల=వండల యందు; వసించి=ఉండి; కుహూ యని పలుకరించుచు నాడుదురు; అనఁగా సుందర స్త్రీల పొందిక కలుగుఁ గాక యనియు, కోకిలములు=పరభృతములు, పగులు శత్రువులు; కొండ లెక్క యనఁగా నిలిచి యని యర్థము. కావు కావుము = రక్షించుమని మొఱ్ఱ వెట్టుదురు. అనఁగా శత్రువులు వశు లగుదు రనియు; కోతులు=కోతిపనులు చేయువాండ్రు పిల్లవాండ్రు; కయి నేసి = అలంకరించుకొని లేక చేతులలో నాడుకొనువారై సింగములతోఁ=ప్రభువులతో; సరసనల్లాపము లాడుదురు. అనఁగాఁ బుత్త్రపుత్త్రికాసంతానము కలుగుఁ గాక యనియు నాశీర్వాదము.

అందఱు

బళిబళీ! బళిబళీ! (అని కోలాహలము)

వేమభూపాలుఁడు

ఇక్కడికి భావకవిత్వభావము తెలిసినది. ఇంక మూఁడవది తరువాయి యున్నది. తత్ప్రభావముగూడ వినఁ దలంచితిమి.

పదకవి

(సంగీతముతో)

౧ ఎల్లి! రావే జాజిమల్లి రావే; మల్లీ మల్లీ
(వొచ్చి) వొళ్లోనూ గూకుండ॥ ఎల్లి
౨ నీతోనే గూకుంటే నిన్నే సూసూసుంటే,
నాపానా మింతాలో లేసీ వస్తా దోసి॥ ఎల్లి
3 సంతాకీ నువ్వోయి సనములో వచ్చీనా,
యింతాలో నామడుసు యిం కొక్కయిద
[మూద్దీ॥ ఎల్లి
ర నువ్వే నేనూ నేనే నువ్వూ నీపానాము,
నాపానా మొక్కొకే సూపేరు లే కాని॥
[ఎల్లి! రావే॥

అందఱు

మేలు. మేలు! బళిబళీ! (అని కరతాళధ్వనులు)

వేమభూపాలుఁడు

ఇక్కడికి మాకు ముత్తెలంగుల గ్రామ్యమును దెలియవచ్చినది. ఇట్టియపాత్రపు గ్రామ్యమునకుఁ బాత్రత గలిగించి విద్యాధికారు లగు వారే కొందఱు మందమతులై గ్రామ్యవాదుల గౌరవించుచున్నారు. ఈ గౌరవించుట కటికుక్కను గంగిగోవుం జేయుటయే. గ్రామ్యవాదీ! నీకవిత్వ మెత్తుకోలు మొత్తికో లను నట్లున్నది. నీవాదము దుర్వివాదము. భావకవీ! నీభావకవిత్వము నేతిబీరకాయ వంటిది. నీకవిత్వములో భావమే లేదు. నీకు గణయతిప్రాస లక్షణము కొంచెము తెలియునేకాని నీవు పండితుఁడవు, కవివింగావు. నీ కవిత్వము పైత్యము. గీతకవీ! లోకములో నీపాడు కవిత్వము ప్రసక్తికిఁ దెచ్చుటకన్న దరిద్రము మఱియొక్కటి లేదు. ఇది బూతుబూఁతైన జావళీ కవిత్వముకన్న నధమము. అధమాధమము. (మంత్రి దిక్కు మొగంబై) మంత్రివర్యా! ఇట్టి గ్రామ్యము దేశమునఁ బ్రబలఁగూడ దనియు దీనిం బ్రసక్తిం దెచ్చినవారెల్ల శిక్షార్హు లనియు నొక్కశాసనము సృష్టించి, ఇప్పుడున్నట్టి గ్రామ్యగ్రంథము లన్నియు నశింపఁ జేయవలయునని శాసించుచున్నవాఁడ.

అన్నామాత్యుఁడు

(గ్రామ్యవాదులం జూచి) మీరు భాషాద్రోహులు. భాషాద్రోహి దేశద్రోహి నాఁబడు. మీరు శిక్షార్హులు. మిమ్ము శిక్షించుట న్యాయశాస్త్ర సమ్మతమే.

అయినను మీరు బ్రాహ్మణులు కావున నిది మొదటితప్పుగా నెంచి మిమ్ముఁ గరుణించి పుచ్చినారము. మీ రింక నిట్టి కవిత్వమును బ్రసక్తికిం దెచ్చితిరేని రాజశాసనం బెట్లు చేయవలయునో మీరే తెలిసికొనుఁడు. పొండు, బుద్ధిగలిగి మెలఁగుఁడు.

గ్రామ్యవాదులు

(అధోముఖులై లేచి నిష్క్రమింతురు).

(తెరలో ఘంటలు)

వేమభూపాలుఁడు

మధ్యాహ్నకాల మయినట్లు ఘంటలు మ్రోయుచున్నవి. నేఁటి కీకొలువు చాలింతము.

(అని లేచును).

[అందఱు లేచి నిష్క్రమింతురు]

అంకాంతము



# ఆనవాలు

పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు గారు

ద్విపద

౧

స్వీయాధికారంబు చేమత్తుఁ డగుచు
న్యాయంబు విడి యక్షనాయకుచేత
ఏడాది, ప్రియురాలి నెడఁబాయు మనుచు
వాడియౌ శాపంబు వడసి యద్దాన
తనదు సామర్థ్యమంతయుఁ గోలుపోయి
వనట యక్షుండు ప్రవాసియై యొకఁడు
శ్రావణమాసంబు సన్నిధియగుడు
జీవితేశ్వరిని సజీవఁగాఁ జేయ
క్షేమంపు వార్తను జీమూతువలనఁ
గోమలికింబంప గోరి యీరీతి
అలకాపురంబునం దలరారు తనదు
నిలయంబు నెఱుఁగ వర్ణింపంగఁ దొడఁగె.

౨

ధనపతి మందిరోత్తర భాగమందు
అనతిదూరముననే యలరు మద్గృహము
దానిచుట్టును శక్రధనువు నాఁగోట
కానవో మఱినీకుఁ గనులఁపండువుగ,
చేతికందెడు పూలచెండ్లచే వంగి
నాతన్వి పుత్త్రి మన్ననఁ బెంపఁ బెరిఁగి
దీపించు నీకు గుర్తింప నాకోట
దాపున బాలమందార వృక్షంబు.

మసృణ వైదూర్య సమంచితనాళ
విస్ఫుమర హేమాబ్జ వికసితం బగుచు.
వాపి యొక్కటి యందు వరలు మారకత
సోపానపంక్తులఁ జూడనై యొప్పి
అందు వసించు రాయంచను నిన్ను
ముందు వీక్షించియు, మోసాలనున్న
మానసంబున కేఁగి మనవచ్చు నంచు
మానసంబున నేని మఱియొంచ వెపుడు.

3

రుచిరేంద్ర నీలోరు రోచిరింఛోళి
విచికిల శిఖరమై వింతగొల్పెచును.
కనకరం భావనాక్రాంతమై జలద!
తనరుఁ గ్రీడా పర్వతంబు తత్తటిని.
మిత్రమా! నాదు భామిని కదిప్రేమ
పాత్రమాటను "బదేపదె" చెప్ప నేల?
నినుఁ దటి త్సందర్శనీయుఁ జూచుడును
మనసున కది మఱిమఱి జ్ఞప్తివచ్చు
జలద! యాక్క్రతిమ శైలంబునందు
విలసిల్లు నొకమాధవీ మండపంబు
దానిచెంగటఁ జలద్దళ మశోకంబు
మానైన పొగడయు మఱికానిపించు

ఆ రెండు నెపుడు దోహదకైతవమునఁ
గోరెదు, ననుఁబోలెఁ గోమలికార్కి
ఒకటి తద్వామపాదోరుతాడనము
ఒకటి తన్ముఖమదిరా పానసంబు.

౪

రవ్వల పీటతో రాజిల్లు పైఁడి
మవ్వంపు గడ,వాని మధ్యఁ జెన్నారు
పచ్చి వెదుళ్లతోఁ బల్లటీలాడు
పచ్చరా యరుగు కన్పడు దానిక్రింద
ఘలుఘల్లుమని పైఁడి గాజులు మ్రోగ
లలిఁదాళములను మల్లలన యాడింప
ముదమొందు నీమిత్ర ముఖ్య మానెమలి
నిదురించు రజనుల నిత్యమాఁగడను.
గుఱుతు వేరొక్కటి గూడఁ జెప్పెదను
మఱిపీని మదిలోన మఱవకు మయ్య,
కలవు వాకిట నిరుగడలఁ గుడ్యముల
సలలితగతి వ్రాసి శంఖపద్మములు
నామెడఁబాసిన నాఁటనుండియును
ఏయుత్సవము లేక మెసఁగుట కతన,
దేజంబు చెడి యిల్లు దీపింపకుండు
రాజిల్లునే తమ్మి రవి నెడఁబాసి.

---

## నా జీవితనాటకము

బసవరాజు వెంకటప్పారావుగారు, బి. ఏ., బి. యల్.

తే. కపటనాటకాల నే నింకనాడ, లేను, తెరదించుడీ, కొరగాని నాలి
వేసముల వేసి పొట్టకై మోసగించి, పరుల లాలించి యాచించి బ్రతుకలేను!
గీ. పుట్టినట్టి పౌరుషమైన పుటక మరిచి, పరుని కృతికి వేసముగట్టు పాపమేల?
నా విధురజీవితమ్మునే నాటకమ్ము, జేసి, ఆడించి, జగతి రంజింపలేనా?



కొత్తపల్లి సూర్యారావుగారు

(వెనుకటిసంచిక తరువాయి)

## ఏడవయంకురము

వివాహమువంటి సంతోషసమయ మేదియు లేదని స్థూలదృష్టికిఁదోఁచి నలువురు నానందింతురుగాని సూక్ష్మదృష్టిని విచారించిన నంతటి పెద్దవిచార మేసమయములో నెన్నఁడును గలుగదు. మగవానికి నాఁడుదానికి నిదియొక్క పెద్దకొడనవచ్చి మీఁదఁబడుటయే—దశాంతరమునను మాఱుటయే—బాల్యాదిదశలుమాఱి గృహస్థాశ్రమమునకుఁ దిగుట మాటలతో మన్నదా! సంసారము మానవలకోయితండ్రీ! యని యొక్క నమస్కారముచేసి, శాస్త్రవేత్తలు గృహ్యసూత్రములు రచియించి మనుష్యులకు ద్వంద్వామరాగమునకు దారిమాపిన సర్వజ్ఞులు, మానవులై యనవులఁబడిపోవుట— దీనికర్థమేమో యాలోచింపవలసినదే. సంసారమును ధరించుటయనఁగా మీఁద నుండి పడుచున్న యాకాశమును బ్రహ్మాండముయొక్క పైడిప్పను దలఁపైఁబెట్టుకొని మోయుచుఁ గష్టభారమును లక్ష్యముచేయక— తల కిందునగులుట లేదు. వానచినుకులు మీఁదఁబడుట లే—దని సంతోషించుటవంటిదే కాదా! ఇప్పటికి మనవారిలో నెంతతో పండలు గడించుచున్నవారు కూడ నెట్లు సంసారమును ధరింతురు — సంసారమనఁగా భార్యయే పరమార్థము— భర్తయనునామమును మేమభరింపలేము. భార్యనెట్లు భరింతుమని చివరి విధిలేక యున్నజంజాటమునువిడిచి యదాయనలు చేయలేక వృద్ధులగుజనకులఁ బోషింపను మాత్రము పనిపూని కుమ్మరిపురుగులవలె సంచరించుచున్నారు. 'పెండ్లి, నాకుఁబెండ్లి, నాకు భార్యవచ్చును, నాకుమగఁడు, నగలు వచ్చునను సంబరముతో, బిడ్డలఁగందు'మను పెద్దయుత్సాహము— వెఱ్ఱిసంతోషము — ఇందుకనియే, జ్ఞానముచ్చినపిమ్మట, నొక్కమాఱనుభవించుసంసారులంగాంచి యేమని మతిమాలుదురో, యీలోకయాత్ర యెట్లుజరుగునో – యెంతో యీసంసారము నాకునలవనిన గ్రామములన్నియు మునిపల్లియలగునేమో యనియే పెద్దలు, 'మామాటలు చిన్నలువినవలయును. మేము చెప్పినట్లుచేసి మెలఁగవలయును. మాయాజ్ఞలవలన మీకుఁ గష్టమువచ్చినను మీరనుభవింపవలసినదియే' యని బంధించివైచినారు. ఎదిగినకొలఁది స్వాతంత్ర్యమెదిగి 'నాకిది వలదు వీఁడు నాకు వల'దనియందురేని— ఎవ్వని నెవ్వతె యెవ్వతె నెవ్వఁడు నిల్పఁగలుగుదురు? అపుడు కానలలో మున్కలలో—పశుమర్యాదలకు దిగుదురు. సంసారమును భరించుట మాటలా? దానికొఱకే శాస్త్రములు చదువుట, రాజ్యము లేలుట, "తెప్పానాం తేలానాం." పరదేశములు ద్వీపములు గుండెలు చేతఁబట్టుకొని తిరుగుట, సముద్రములు దాఁటుట, యీపొట్టలు రెంటికినీఁదవలచాలదు. భూమిలోనుండినిక్షేపములు త్రైలు తేలినఁగాని యేమునఁగు దాహము చూరునీళ్లతోఁ దీఱదని భూములు పెల్లగించి యొలుకఁబోసి యెత్తికొనుట—సంసారమును భరించుట మాటలా? తాను గోఁచిపెట్టుకొని

తిరిగిరాయైనను భార్యను సుమ్మముడిగి రానీయక, దొమరుల కంటఁ బడనీయక, యింటిగుట్టొకరికిఁ జెప్పక, 'నలువురితో నారాయణా'యని సంచరించుట సంతోషమునుచేతనేనా! మోసముచేసి పెద్ద లిట్టికష్టములలోఁ బడఁద్రోయుచున్నారు. తప్పదు సగమునగములో విడువరాదు. దీనియంతేమ చూడవలయునని నడితికుండలోఁ జేబారలువేయుట యూపందముచేతనా! సంసారమును భరించుట మాటలా–రోగములతో రొట్టులు, బిడ్డలను బెంచుట, పెద్దవారిం జేయుట–ఈ పెద్దవారిం జేయుటలో నెంత యర్థమైన నిమిడియున్నది. ఓసక్కా! ఏదీ, పెద్దవారిం జేయుట యన నెంతగంభీరాభిప్రాయమున్నదో వర్ణింపుము! వారికిఁ బెండ్లిండ్లు, వారికి సంసారములు, మన వేమ మే వారికివేసి మెండిపెక్కువలె, మనము కష్టపడుచున్నపుడు వీరేల యూరకుండవలయునని యమాయచేత నవలె–నోతిలోఁ బడఁద్రోయుటయే–అబ్బబ్బ! సంసారమును భరించుట యనిన మాటలా? మగఁడు లోకాంతరగతుఁడైన, మగువ నడుము నాయఁగట్టుకొని బిడ్డలం బెంచుట–దైవమా! సోమలేశ్వరా! ఉమారమణా! నలుమనలును; మగువ కీకష్టము వలదు, తెచ్చిపెట్టకుము. మగువ ముందే లోకాంతరము చేరెనా మగవానికష్టము చెప్పఁ దరమా! అపుడు మగవాఁ డాఁడుదిగా మాఱవలయును. చేతఁగానిపై యీరెండువిషయములం దలంచుకొంటిమా, వారువారు నలవాటు లేనిపనులలోఁబడు కష్టములం జూచితిమా, స్వామీ! ఒడలు గగుర్పొడుచును. వెంటనే సన్న్యాసాశ్రమము స్వీకరింపవలయుననినంత వైరాగ్యము గడుంగష్టమనకైనఁ బుట్టును. పెండ్లియనఁగా నొక్కసారి యాఁడుదానికి–అనుకొనుచున్న దానికి–ఈప్రపంచము తలక్రిందుచేసి భూలోకములోని దానినిదీసికొనిపోయి యంతరాళమున వ్రేలాడఁదీయుటయో! ఇంతెకంటె వేఱొకటియని యనుభవశాలులును మఱెవ్వక్క దానిం జెప్పఁజాలరని చెప్పవచ్చును. బాలికకుఁ బెండ్లియైనదనిన వెంటనే రెండవ పనిలేదు. 'నాపెనిమిటికి దీర్ఘాయువిమ్ము. నాభర్తకు సుజ్ఞాన మొసఁగుము. నావానినను నాయందుఁ గరుణపుట్టునట్లు చేయుము. నా పతికి సంసార ప్రభుత్వ మిమ్ము. నా పతికి, ధనధాన్యములు ప్రసాదింపుము'—అని దేవుళ్ళకుచెప్ప పెద్దలు వేఱొకదారి చూపింపలేదు. అంతయు నింతికిఁ గాంతునితో నున్నది. పెండ్లియన నొక్కపందెమునంటిది. రామరావణయుద్ధమునంటిది. ఎవ్వరు గెల్తురో, యెవ్వరోడుదురో, పందెముగాదు, యుద్ధముగాదు– గెలుపుఓటములునైచికొనుటవంటిది. అదృష్టమెవ్వరివంకఁ దిరుగునో, పదికాలములు తిన్నగా నడువవలసినదేకాని– నడుమనే యవాంతరమువచ్చునో, శివా! వద్దువద్దు, తండ్రీ! జ్ఞాపకముచేసికొనరాదు. ఆఁడుదానికి మగవానితో నున్నది. మగఁడుతప్ప దానికి నేఱుదైవము, పూజలు, వ్రతములు, యాత్రలు లేవందురు. అర్థమేమి? బాగుగా నాలోచించితిమా– ఆఁడుదానిగతి యధోగతి! ఆఁడుదానికిఁ బెండ్లియైనదనినమాట గుండెలు గుభేలున వ్రక్కలించు పిడుగుగాని మాటయనవచ్చునా– ఎందుకనో చూచుచున్నాము. ఎన్నికష్టములో పడుచున్నాము. దానిపైఁగల యాశ–ఛీ ఛీ!

"అన్నమైన నదేమిరా, సున్నమైన నదేమిరా" యని వేదాంతి– అన్నము సున్నము నొక్కటిగా కనుక యన్నమే తినవగునురో యని– పాడునట. అట్లే సుఖదుఃఖములలోఁబడిన సంసారియును బాడును. దానిలోని రుచియెట్టిదో – దానిసున్నరుచి యితరవస్తువులకు లేదు. అజీర్ణముం జేయు తియనిలడ్డువముందిన బుద్ధి పుట్టునుగాని యారోగ్యమునిచ్చు మిరియములకషాయముఁ ద్రావ బుద్ధిపుట్టదు. నేను గవినిగాను గాని వేదాంతిని– నేను సంసారమునుగూర్చి వర్ణించిన భ్రమరకీటన్యాయము పట్టునేమో–పట్టకేమి? నేనెందున్నదానను? సంసారమను పెద్దవెనలు పైన తేనె బాలియందు మీఁదఁ వ్రాలినయీగను; పడుచున్నదానను, బానిసలోఁబడి కొక్కఱడడివి కాలుచేతులంటుకొనిపో విలవిలలాడు నవస్థ మేయింక. నేనొక్కరినిదూషించిన నూషించిన 'నీచప్రపంచమునుండి యూడిపడితి'వని నలువురు నవ్వుదురు.

ఆభగవంతుఁడు మమ్ము మఱచిపోవలసినదే. కాని, మాలోనేమున్నది? మాపై నాతనికిఁ దలంపులేకుండ నుండవలయును. అట్లయిన మేము మువ్వురము నొకరీతిగా నుందుము. మీల తలంపకుండ నుండుము? అంతటి తొందర పనివాఁడు జగత్తులో నెంకొక్కఁడు లేఁడు. ఆభగవంతుని దేనిజీఁగలోఁ బోల్చవచ్చును. ఇది హీనోపమయందు

లేమో కాని యూతనిపట్లఁ బూర్ణోపమరే - ఒక్కక్షణ మూరకుండఁడు. ఏకకాలమునందే రెండుమూఁడు లక్షల కోట్లు పనులుచేయ మొదలు పెట్టును. పట్టణములోని రాజకిరీటములోనికి మణినికల్పించుటకును, గుహాలలో నిద్రించు సింహాము చెవిలోనో, రోమములమీఁదనో దూఁకుచుండు మిడినల్లితో నీడపేనుతో కాలువిఱుగఁ గొట్టి బాధించుటకు, మహాసముద్రములోని తిమింగిలమును గడుపుమూడ్చి, తిండికొరకై చిఱుచేఁపకై పరుగులిడుచున్న దానిని వేఁటాడుటకై వేఁటకాండ్రను సహాయము చేయను,-ఒక్కడాని కేమి-యన్నింటికిఁ దానేపో వలయును. ఒక్కచెట్టు నెండింప, నొక్కచెట్టు (బండింప) నొక్కయూకరాల్ప, నొక్కకొమ్మ చిగిరింప-నెక్కడనో పడగొట్టి దారిలోఁ బడిపోయిన బాటసారి ముసలివానికి గంజినీళ్లు పంపుటకై సంసారి నొక్కని లేపను, మునిఁగిపోవుచున్న ద్వీపాంతరములోని రెయోడలోని బాలు నుద్ధరింప నొక్కపలక నమరించుటకు-'ఇంతుఁగల దెందు లేఁ'డని సందేహములోఁ బనిలేని యీశ్వరుఁడు-కునలను మఱచి యుందునా! పాపము మఱచియే యున్నాఁడు. మేమెన్నిపాట్లు పడుచున్నామో కనుఁగొనుటలేదు. మా కర్మమున మేమున్నాము. అడిగోఁగర్మమనఁగా నెవ్వరు? అట్టే దూరము పోవలదు. వేదాంతము ముదురవీయ రాదు.

లక్ష్మీనారాయణునకుఁ దల్లి లేదు; తండ్రి యున్నాఁడు. శంకరదీక్షితునికిఁ దండ్రి లేఁడు, తల్లి గలదు. 'వారములు చేసికొని నాలుగు ముక్కలు నేర్చికొనుటకై నన్నుఁగూడ విడిచిపెట్టి స్థలాంతరవాసము చేసి కష్టార్జితముగా సరస్వతితోపాటు లక్ష్మిని సంపాదించుకొన్నాఁడా మాలక్ష్మీనారాయణమూర్తి'యని యూతండ్రిపడిన సంతోషమునకు మేరలేదు. 'ఎన్నిదినములైనది! నాకిప్పటికీశ్వరుఁడు సుఖముం గూర్చినాఁడా! నాకొడుకు గృహస్థాశ్రమము స్వీకరించాఁడా! నాకు వట్టింట నాకు నైచి వడ్డించుటకు నాభార్య యీకోడలిని బంపించినదా!' అని, చెప్పనలవిగాని సంతోసము. మాయమ్మ, 'కొండంతవలె. వడుగువెట్టఁగానే పిడుగు పడినదన్నట్లు-అత్తవారియిల్లు చేరఁగానే కుండ చేతికి వచ్చినదని విచారింపలేదు. పోనిమ్ము, సంతెగుమ్మ మూడ్చి నీళ్లుచల్లి, నాలుగుముగ్గుకఱ్ఱల వెట్టుటకుఁగాని, దీపము వెలిగించుటకుఁగాని 'లేక, పాడుపడియున్న సంసారమును నాలక్ష్మి మరలఁ బొత్తుచేయుచున్న'దని యానందించినది. అలవాటు చేత-'అమ్మా నే నదికికొందునే; నేను మంచినీళ్లు తెచ్చెదను; బింది యిట్లిమ్మని మామగారు దయచేసనే పల్కనాఁడు. "మీకేలకష్టము నేనుండగా"నని లక్ష్మి పల్కును. "నేను తేపిచేసి మెలఁకువలు నేర్చియున్నవాఁడను, నీవు క్రొత్తదానవు-నీవుండు"మనువాఁడు-"నేర్చినవారు మీరు నేరని దానికి నాకు నేర్పుఁ" డను నది లక్ష్మి-ఒక్కపని చేయనిచ్చునదికాదు. లక్ష్మీనారాయణునకు వేఱుపని లేదు. ఏఁడాదికొక్కసారి బల్లిపాడు వెళ్లి దస్తుపిస్తులు తెచ్చికొనుట, తండ్రిని బువ్వలలోఁ బెట్టి పూజించుట-'ఆహా! శంకరా నాపై దయవచ్చినదా! దయవచ్చినదానికా మరల సంసారములోఁ బడవైచుచున్నాఁడవు.' అని యాయపలాయన రాత్రిందివము లాకోడలిని గొడుకును ముద్దుసేయుటకప్ప వేఱుపని లేకుండెను. గౌరియత్తగారు-'భగవంతుఁ డెక్కడ లేఁడు; దిక్కులేనిదానను; ఒక్కగా నొక్కకొడుకు; ఆపూటకు గతిలేదు; దేవుఁడా రొట్లురాయని బెంగపెట్టుకొన్నదానను. నాకొడుకుపై దయవచ్చినదా! తిండిలేనివాని కైశ్వర్యమిచ్చి, భార్యనిచ్చి, దీర్ఘాయుష్యమిచ్చి నాకన్నులు చల్లఁబఱిచి నన్నుఁ జలికాలదన్నినాఁడా! అమ్మతరామయ్యగారు పెట్టినదీపముగదా యిది. దివ్వెపెట్టి యూమహాత్మునకు మ్రొక్కవలయును. 'ఏతికొనితిను కష్టవాఁడే, వీనికేమి మనబిడ్డనేమి, యిమ్ముటరే'మని తలఁచినాఁడా; అగును, మాటికిఁదిక్కువగాని కులమునకుఁ దిక్కుగాదుగదా; ఏతంతస్తులమేడమీఁద నింకొక్కయంతస్తు లేవఁదీయుట మంచిదా పడిపోవుచున్న ధర్మసత్రము నడికొప్పు బాగుచేయుటమంచిదాయని యాలోచించినాఁడు.' అని సాంతపోయినది. మాయమ్మ, 'అయ్యో! అత్త కోడలికను కత్తిమీఁది సాముగదా! ఆముసలిదానిచేతిలో నీకసుగందు, బ్రతుకుటయెట్లని కొండంతవలెఁ దలంచినదా! మఱి కొండంతవలె 'నా ముసలిమంచమువచ్చిన మాపాండ్రిద్దఱుపోయిగానుందురుగదా'యని దురూహాలు పెట్టుకొన్నదా! లేదు 'బిడ్డయదుగుపెట్టినవేళ మంచిదైనఁ బదిమందిచుట్టములు వత్తురుపోదురు. అల్లవారిపిల్ల మంచిది; చుట్టాల ను

రఖీ యని పొగడుదురు. అత్తయింటఁ గొంతచేయూఁత యున్నది. మగఁడు చిన్నతనమునుండి సుపరిచితుఁడు, బుద్ధిమంతుఁడు- యేమోయేఁలుకొని తిందురని విడిచి నామా, కంచము, ముంత, కూడు, నుడ్డ, యిచ్చి బ్రదుకుమని పంపితిమి- ఈవిసువుల చుట్టలీకమున నా కన్నిసఫుల బంధుజాలము పెరుఁగునుగాక! నాకేమికొదవ-'అని కొదవయేదో జ్ఞప్తికిరాఁగాఁ గొంతసేపు కన్నులనీరు పెట్టుకొనుచు ననుదినముగాలక్షేపముచేయుచున్నది.ఆకొదవ భగవంతుఁడు తీర్పవలసినది; తీర్చువాఁడుకాఁడు; మింద లేదు. తీర్పవచ్చును. ఎంతమంది కొదవలు తీరినవికావు.

మాయమ్మకు మాకుటుంబముపై బెంగయొన్నఁడును లేదు. నిర్విచారము, విచారములేకేమిగాని- ఇది యొక వి చా ర మా - 'దేశముగాని దే శ ము లో ను న్న ది. మనమాట మనవుంతి లేదు. బిక్కు-బిక్కు-మనుచు నున్నది. మగవాఁడు పనిలోనికిఁ బోవును. ఇరుగా పొరుగా;ఏదో భాష యఁట. దీనికేమి తెలియును.' అని తలపోయుట మాయమ్మ కొక్క విచారమేమో కాని నాకు విచారము లేదు. మేము కైలులోని పనివారమగుటచేఁ గాశీ యాత్రకుఁబోవు తెనుఁగువారందఱు మాకుఁ బ్రతినిత్యము కనఁబడుచుందురు. దేశక్షేమము,గ్రామారోగ్యము, బంధువార్తలు తెలియుట కెవ్వరో యొక రొకరువచ్చుచునే యున్నారు. ఎఱిఁగినవారు కైలులోఁ గనఁబడిన 'రేపు వెళ్లవచ్చును రండ'ని దింపి యింటికిఁదీసికొనివత్తురు. మా కావాఁడు వారితోఁ గిల్లుబొల్లుమనుచుఁ గడచిపోవుచున్నది. లచ్చికిఁ జీరయని, నాన్నకుధావళియని, గౌరికిఁ బట్టురవికలని, అమ్మకు మహాలక్ష్మిపీటయనిఁ గారి యత్తకుఁ దులసికోటయని, లచ్చిమామగారికి నాగరాక్షరముల పుస్తకములని యేవో యెవ్వరిచేతనో మేమిక్కడి నుండి పంపుచున్నాము. మాకే బెంగయును లేదు. అందఱ క్షేమవార్తలు తెలియుచున్నవి. కనుక, నిరాలోచనముగ నున్నారము. జీతమంత యెక్కువదిగాదు. అత్తమామలకు మాదానిలోనుండి వారికిఁ జలినీళ్లకు నేఁడినీళ్లతోడని పంపుచుందుమే కాని వారినిద్దఱి నిక్కడఁ బెట్టుకొనుటకుఁ జాలినంత లేదు. వారికక్కడ, మాకిక్కడఁ గడచుచున్నదని సంతోషము. అందఱవంటి గుణముగల వారైన నింక రెండుకుటుంబములను బోషింపవచ్చును.గడి పఱకకఁ-కేఁకగాలాడునిప్పువలెఁ జూతురు. తామేయున్న వారిలో నక్కడఁ బెద్ద. చేతిక్రిందఁ బదిమందియున్నారు. తీఁగటపాలో నొక్కరు, చీటిచ్చువా రొక్కరు, రాత్రిపనివారు కొందఱు, దీపములుచూపుటకు, దారులు మరలించుటకు, మూటలెత్తుటకు దింపుటకు, గుడుచుటకు నెండలోయున్నారు. అందఱ నొక్కత్రాటిమీఁద నడిపింతురు. 'కక్కుఱితిపని పనికిరాదు. అడిగి పుచ్చుకొనుఁడు. దారులు కొట్టకుఁడు. మనజీతము మన కన్నుతము. అన్యాయవిత్తము విషము. మనసు కుదిరియిచ్చినది పుచ్చుకొనుటలోఁ దప్పులేదు. అది మనకరుగుమ' అని బోధించి వచ్చి నెట్టులుపడియున్న మూటలలో నుండి కోసి యపహరింపకుండ నేతి డబ్బాలకుఁ జిల్లులుపొడువకుండఁ గట్టడచేసిరి. వచ్చుదుమ రథములు,బాటసారులు,'స్టేషను మేష్టరుగారు-బహుమంచివారు,అక్కడివారును సజ్జను'లని పొగడుచుండిరి. కూర, కాయ, గింజ, గిద్ద, నూనె, నేయి, పండు ఫలము స్టేషనులో నెగుమతికి వచ్చినవి దిగిచి మాపదిమందికి దొరకుచున్నవి. న్యాయముగా మంచిచేసికొని తినినది లోపకార్యము కారాదు. అట్టివారుకానిరెండుఁల 'వీరు తీసికొనితినుచు నేయున్నారు; మరల మన మేల?' అని నిరాదరమునహింతురు. పనివాండ్రందఱును మహారాజ్ మహారాజని యడుగులకుమడుగులొత్తుదురు. ఈ మహారాజమూలమున మనకింతయున్నము దొరకుచున్నదని సంతోషపడువారు. విశేషమేమనఁగా నీస్టేషను, మాఊరుమూల జేకొండలలోనో లేదు. పట్టనము సమీపమునఁగలదు. కావలసినంత బయలుఁగలదు. నలువురివలెనే మేమును జిన్న యూవును సంపాదించికొన్నారము. చిన్న మేష్టరుగారు మాకంటెముందు వచ్చియున్నవారు, గావున,వారొక్క యావును సంపాదించుకొనియున్నారు. రెంటిని మేఁపలేక 'సంప్రదాయము మంచిది. మాయింటఁబుట్టినది, పాలుకుడిచినది, ప్రక్కకు కేరుపాలిచ్చు దానిబిడ్డ, మీరు పుచ్చుకొనుం'డని యేకోరూపము పేరు పెట్టి మాకిచ్చినారు. నెలనెలకుఁ గొంచెము కొంచెముగా దానివిల మారొద్దనుండి పుచ్చుకొనుపద్ధతిమీఁద గ్రహించినారము. నాకుఁబుట్టినింటఁగూడ దూడలపరిచయము గలదు. ఏకాఁపో బండేఁడు గడ్డిపంపుచున్నాఁడు. పనివాండ్రు చేతిలోనున్నారు. ఆవీని పెయ్యదూడను బెట్టి

నది. నాకింటిముద్ద నొకరితోఁబని లేదు. మాడలేమో, నేనేమో పొట్టనిచ్చితిని- కట్టుఁగట్టుయొద్దఁ దుడిచిపాడి గానుండుట, యంటులు నానవేయుట-చెప్పవలదా? ఒక్క పనివానియిల్లాలుదొడ్డది. 'మాయీ, మాయీ' యని నన్నెప్పుడుపలుకు. దానిమాటలు అమ్మాయీ! అమ్మాయి! యని నాయమ్మపిలుపువలె నొక్కొక్కప్పుడు తోచుచుండును. తల యంటుకొనునప్పుడువచ్చి శీకాయనూఱిపెట్టును, వీఁపు తోముచు. నా తెనుఁగునంత ఆమె కెంతో యిష్టము. వీరొ పంతెనలు కట్టునప్పుడు చిన్నతనములోఁ దండ్రితో మన దేశమువచ్చినదట- ఆపరిచయముచేత, నన్నాపె కూర గాయపాటలతో నన్నునసరించుచుండును. ఆమె సావాసమే నాకుహిందీ నేర్చుకొనుటకుఁబనికివచ్చినది. పొద్దెనుచు వానికొడుకే మాయావును బగలంతయు నెక్కడనో మరలించి మేఁపుకొనివచ్చును. ఎప్పుడైన నేను, తోఁటే యనిపిలిచిన, 'హా! మాయి!' యని యంతలోనేవచ్చి పడుచుండు. చిన్న మేష్టరుగారు బాబూలు; వారిభాష యిది కాదు. కానిదేశభాష హిందీ వారికివచ్చును. ఓహో యనుచుఁ, గనులు కార్యము లపుడేకాని వారియాఁడువారితో గట్టిపరిచయము నాకుదొరకలేదు. నీళ్ల గొట్టముకడకు వారురారు. ఏపనివాఁడో తెచ్చియిచ్చును. మఱియు వారియింటికి మాయిల్లు కొంచెముదూరము.

కొన్నినాళ్లకుఁగాని తెచ్చుకొనవలసినది బియ్యమును వస్త్రములునే. తక్కినవన్నియు యథేష్టముగా నింటికి వచ్చుచుండు నంతటి సమయము వచ్చినది. తల్లిదండ్రులను రప్పింపవలయునని తలంచిరి. రైలులోఁ బెద్ద యధికారుల మూలమున వారినిద్దఱను రప్పించుటకు ధారాళముగా మార్గపత్రము సంపాదింప గట్టి యత్నముచేసిరి. ఇంతలో సామ్యము చెప్పినట్లు - ఒక్కరాజునకు బీదవానిపైఁ గరుణవచ్చి రేనుఁగు నిచ్చినాఁడట-ఏనుఁగును బుచ్చుకొన్నామన్న సంతోషమేనా - పెంచుటలోఁ గష్టముమాట! ఈరీతిగానే జీతమెక్కువ చేసినామని యధికారులు కలకత్తాకు మమ్ము మార్చినారు. చీపురు పుడకయొద్దినుండి యిక్కడి యిక్కడనే విడిచి, యాపద్ధతి మీఁదనే యావును గూడ నొకరికిచ్చివేసి-జీతమెచ్చునకు నగరములో రట్టింపు సెలవులకు - సమానమాసములతో నధికారులయాజ్ఞ ననుసరించి కలకత్తా చేరితిమి. ఇంక వారిని దీసికొనివచ్చుట యెక్కడ? కొంచెము గొప్ప? చేతిలోనిది కూడ జాఱిపోవు నవస్థవచ్చినది.

"మహారాజ్ కో బదిలీ హోగయా హై" అని యక్కడి పనివాండ్రే కాదు- చుట్టుప్రక్కల వర్తకులు మొదలగువారు మేము రైలుదేఱునాఁడు రైలుకడకు మమ్మంపవచ్చిరి. ఇదియును జెప్పవలసినదే. రైలుకదలు నప్పుడొక్క వర్తకుఁడు ప్రీతిపూర్వకముగాఁ దాంబూల మిచ్చినాఁడు. అది మేమెంకటి రెండు నెలలు లేదవు కొనసుంటఁ గలకత్తాలో చక్కఁగా స్థిరపడుట కుపకరించినది. ఆతావు విడుచుట మాకును గష్టమే యనిపించినది. అత్తవారింటికిఁ గ్రొత్తకోడండ్రు వెళ్లునట్లు దిగులుదిగులు మనుచునే వెళ్లినారము. అక్కడమాత్రము మనుష్యులు లేరా? ఇదియేనా మనము పుట్టినప్పటినుండి నివసించుచున్నది? నేను రాక మునుపు రెండు తావులకు మాఱితి. ఎక్కడనున్నను నోరుమంచిది కావలయును. మనదేశస్థులు కలకత్తాలోను బెక్కురుందియున్నారు. కాశికి వెళ్లువారందఱు నక్కడ దిగుదురు. కాళికాదేవి సాన్నిధ్యము చేరితిమి.

## ఎనిమిదవయంకురము

విద్యయందాశలేనివారును, గతించిన వ్యర్థకాలమునకై పశ్చాత్తాపపడనివారును, జేరుగడింపవలయునను నభిప్రాయము లేనివారును, ధనమున్నదే చాలును-మఱి యొక్కఁడు లేదనువారును, బీదరైనను సంసారభారమునకు విసిగినవారును సాధారణముగా నుండరు. పెండ్లి కాకమునుపే- 'యింటనున్న విద్య యబ్బినదికాదు. అది నాలోపముగాదు. నాయదృష్టదేవతచేసిన లోపము. ఊరిలో మేలు విద్య నేర్చుకొనుట కుపపత్తులు లేవు. అది నావంటి బాలురు చేసిన సంఘదుష్కృతము. ఇంటఁ గావలసినంత ధనమున్న నేపట్టినమాచేరి యేదో చూడవచ్చును. అది మాకుటుంబము చేసికొనిన దౌర్భాగ్యము. వారితో వారితోఁ జేసిన కృషి యింటిలోఁ దండ్రితోనే చేయక పోయితినే - దృష్టి మేలుగానుండుటచేఁ దండ్రిమాటలు చెవి కెక్కలేదు. "కలవిద్యలెన్నియైనను గలవిద్యకు సాటి రావు-' దానివలన ధనము రానీ మానసీ, యది యలవడినది గాదు. ఇహపరసాధనములైన వేదాదివిద్యలు నా కబ్బునా! పొట్టకూటి విద్యయైన నొక్కటి యలవడినదా!

